# గ్రంథాలయ సర్వస్వము.

సంపు. ౭. ‖ బెజవాడ - మే, జూ॥ ౧౯౨౯. ‖ సంచిక ౧౧, ౧౨

## బరోడారాష్ట్ర గ్రంథాలయసభ.

నాల్గవ బరోడా రాష్ట్ర గ్రంథాలయమహాసభ 1929 సం॥ రము మార్చి నెల 28-29 తేదులయందు అమరేలి పట్టణమందు సర్ ప్రభా శంకర దల్ పత్ రామ్ పట్టాణీగారి అధ్యక్షతక్రింద జరిగినది. బరోడా రాజ్యమందున్న 250 గ్రంథాలయములనుండి ప్రతినిధు లేతెంచిరి. అమరేలి పట్టణమందున్న గ్రంథాలయమువారు ప్రతినిధులకు కావలసిన ఏర్పాటులనన్నిటిని జయప్రదముగా గావించిరి.

ఈసభతోబాటు గ్రంథాలయ ప్రదర్శనమునుగూడ జరిపిరి. బరోడా రాజ్యముయొక్క గ్రంథాలయ శాఖయును, బరోడా గ్రంథాలయముల సహకారసంఘమును, మాక్మిల్లను కంపెనీవారును, వాకరు గ్రంథాలయమువారును ప్రదర్శనమునందు అమూల్యవస్తువులను ప్రదర్శించిరి. బరోడా రాజ్యమందున్న 706 గ్రామ గ్రంథాలయములును, అచటి సంచార గ్రంథాలయములును, బాలశాఖయును ఎటుల పనిచేయుచున్నవో జూపిరి. ఇవిగాక ఇంగ్లీషు, గుజరాతి, మహారాష్ట్ర భాషలయందు "పోష్టరు"లనుగూడ ప్రదర్శించిరి. ఒక చోట 1928 సంవత్సరమునందు గుజరాతీభాషయందు ప్రకటింపబడిన గ్రంథముల నన్నిటిని ప్రదర్శించిరి. పాశ్చాత్య దేశములందున్న సుప్రసిద్ధగ్రంథప్రకాశకులందరును మాదిరీలను బంపిరి. ఇంకను మదారాసునందున్న గనేశను, గననాశను కంపెనీలును, అహమ్మదాబాదునందున్న ఛీఫ్ లిటరేచరు సొసైటీవారును, భావనగరమందున్న దక్షిణామూర్తివారును, అహమ్మదాబాదుయందున్న కుమార కార్య

స్థానపువారును సౌరాష్ట్ర నవజీవను కార్యస్థానపులవారును గ్రంథములను ప్రదర్శించిరి. లిఖితపత్రికకు ఒక బహుమతి నిచ్చెదమని ప్రకటింపగా, 65 సచిత్ర లిఖితపత్రికలు ప్రదర్శింపబడెను. ఇప్పుడు ప్రచారములో లేని పాత గుజరాతీ పత్రికలు నూరు సంవత్సరముల క్రిందట ప్రారంభింపబడిన ఒక పత్రికగలదు. ఈకాలమునందు ప్రకాశితమగు ఆంగ్లేయ గుజరాతీ భాషాపత్రికలు ప్రదర్శింపబడెను. బరోడా రాజ్యమందలి గ్రంథాలయోద్యమము విపులముగా విశదీకరింపబడిన అచ్చుగ్రంథమునుగూడ పదర్శించిరి.

28 వ తేదీ ఉదయమంతయు ప్రదర్శనమును జూచుటతో సరిపోయినది. మధ్యాహ్నము ఆహ్వానసంఘాధ్యక్షులగు రాజా రత్న హరిలాలుగారి ఉపన్యాసముతో సభ ప్రారంభమాయెను. కతియవారు ద్వీపము ఐశ్వర్యసంపన్నులగు రాజులతోను, రాజ్యాంగవేత్తలతోను, వర్తకులతోను తులతూగుచున్నను ఒక విశ్వవిద్యాలయమునుగాని, కార్మికవిద్యలను నేర్పు పాఠశాలగాని, తుదకు ఒక మంచి గ్రంథాలయమునుగాని లేదని విచారించుచు అట్టివాని నొసంగగల కార్నిజీవంటి మహాశయుడు ఎప్పుడు తమ రాష్ట్రమందు ఉద్భవము కాగలడోయని వాపోయిరి.

అధ్యక్షుని ఉపన్యాసము.

పిమ్మట అధ్యక్షులు తమయాసనము నలంకరించి, తన దీర్ఘజీవితమునందు గ్రంథసమీకరణమునందును గ్రంథపఠనమునందును అమిత యాసక్తి గలవాడననియును ప్రపంచమునందున్న అనేక గ్రంథాలయములను జూచితిననియు వచించిరి. ఈసభకు అధ్యక్షత వహింపవలెనని తన్ను కోరినప్పుడు తాను గ్రంథాలయములను గూర్చి నేర్చుకోవలసినదేమియు లేదని తలంచితిననియు, కాని ఆ యుదయము గ్రంథాలయ ప్రదర్శనమును జూచినప్పుడు గ్రంథాలయములయొక్క మంచి ఉద్దేశములను, జనసామాన్యాభివృద్ధికై అవి చేయదగిన అనంతములగు మార్గములను గూర్చియు తెలిసికొంటిననియు జెప్పిరి. హిందూదేశము అన్నిదశలయందును అభివృద్ధిని బొందుచున్నది. అట్టి

అభివృద్ధికి మార్గదర్శకులలో గొప్పవారు బరోడా గైక్వారుగారు. అట్టి మహానీయునితో స్నేహముజేయు భాగ్యము ఆయనకు అబ్బినది. పాశ్చాత్య దేశములయందలి ఏ గొప్ప రాజకీయధురంధరునితోగాని, పరిపాలకునితోగాని, సంస్కర్తతోగాని పోల్పదగినవాడీ బరోడామహారాజు ఒక్కడే. రాజ్యము రాజుకొంకుగాదు, రాజ్యమునందలి ప్రజల కొరకు - ఈ కారణము చేతనే బరోడారాజుగారు విద్యావిషయము నందును సార్వజనిక గ్రంథాలయముల విషయమునను యీ దేశము నందు మార్గదర్శిగా వెలయుచున్నారు. ఇతర సంస్థానములందలి విద్యాధికారులు అనేకమంది విచ్చేసినందుల కెంతయు సంతోషముగ నున్నది ఇక్కడ చూచినట్టియు విన్నట్టియు సంగతులను వారు తమ అధీశులతో జెప్పి వారిసంస్థానములందు గూడ ప్రజల ఉపయోగార్థము ధర్మగ్రంథాలయములను స్థాపించునట్టుల చేయుదురని కోరుచున్నాను. భావనగర సంస్థానమునందు నా శాయశక్తుల పనిజేసితిని. వారి సంస్థానమునందు ఒక భవనమునందు మంచి గ్రంథాలయమే పెట్టబడినది. కాని బరోడాయందున్నంత ఉత్సాహము లేదు. అనేక సంవత్సరములనుంచి పని జేయుచున్న ఉద్యమాభిమానుల యొక్క మొక్కవోవని దీక్షయే బరోడా గ్రంథాలయోద్యమము యొక్కయు, ఈ సభ యొక్కయు జయప్రదమునకు కారణము. చలనరహితమైన వట్టి తెలివితేటల వలన శాస్త్రము సంస్కారములు ఆచరణలోనికి రావు; తెలివితేటలుగలిగిన మనుజుని యొక్క ఉత్సాహాగ్ని వలనను, వారికి ఉద్యమమందుగల లగ్నత వలనను మాత్రమే అవి ఆచరణకు వచ్చును. అట్టి గ్రంథాలయభావుకులను ముగ్గురిని ఈనాడు కలుసుకొంటిని. వారికి జన్మ యొక్క పరమార్థము గ్రంథాలయతత్త్వమును వ్యాపింపజేయుటయే. వారు బరోడా గ్రంథాలయ శాఖాధికారియును, సహాయ శాఖాధికారియును బాలశాఖాధికారియును. వారుగాక వృత్తిచే వ్యాపారస్థుడైనను, ఇట్టి గ్రంథాలయ భావుకులలో ప్రతాపరాయ్ మెహతా గారిని గూడ చేర్పదగును. ఉపకారబుద్ధి గలిగిన ప్రభుత్వము - తమ ధర్మమును గుర్తెరిగిన ఉద్యోగులు - కృతజ్ఞులును తెలివితేటలు గలిగి

నట్టియుప్రిజలు-ఇవియే బరోడాయందు గ్రంథాలయోద్యమమును జయప్రదము జేసినవి. అంతటితో నాటి సభ ముగిసెను.

కార్యనిర్వాహక సంఘము.

29 వ తేదీన కార్యనిర్వాహకసంఘమువారి నివేదికను జదువుటతో సభ ప్రారంభమాయెను. గతసభయందు తీర్మానింపబడిన ప్రకారము "గ్రంథాలయ దినము" నొకదానిని ఏర్పరచి, ఆదినమున బరోడారాజ్యమునం దంతటను గ్రంథాలయముల ఉపయోగమును గురించి ఉపన్యాసముల నిప్పించుటయును, గ్రంథములకై ద్రవ్యమును వసూలుజేయుటయును జరిగెను. జనులందరికి బాగుగా తెలియనప్పటికిని, ఫలితములు మిక్కిలి సంతృప్తికరముగా నున్నవి. జిల్లాపట్టణముల యందు అదివరకే రాజుగారియొద్దనుండి సహాయమును పొందుచున్న సార్వజనిక గ్రంథాలయములున్నప్పటికిని, స్త్రీలకు బాలురకు ప్రత్యేక గ్రంథాలయములను గూడ స్థాపించుకొనుటకు బరోడారాజుగారు అంగీకరించిరి. గుజరాతు, కతియవారు దేశములలోగల గ్రంథాలయముల చరిత్రనుగూడ ప్రకటించిరి. ఇతరప్రాంతములందు అనగా మదారాసు, బర్మా, బెంగాలు, ఆఫ్రికాలందుగల గుజరాతు గ్రంథాలయముల చరిత్రగూడ అందుగలదు—

8000 గ్రంథములు గల గుజరాతు భాషాగ్రంథముల పట్టికగూడ ప్రకటింపబడినది. దానిఖరీదు రు 7 లు. అది అమెరికాదేశ గ్రంథాలయ సంఘము యొక్క పద్ధతుల ననుసరించి, గ్రంథకర్త, గ్రంథముపేరు, ప్రచురణకర్త, ఖరీదులను దెలుపుచు, గ్రంథకర్తపేరు, గ్రంథముపేరు, విషయముపేరుల ననుసరించి వర్గీకరింప బడినది.

ఈగ్రంథమునకు అనుబంధముగా గుజరాతీగ్రంథముల వర్గీకరణ పద్ధతికూడ ప్రచురింపబడినది. అందు "కట్టరు"పద్ధతిని తయారు చేయబడిన గ్రంథకర్తల నామముల అకారాది పట్టికగూడ గలదు. దీని ఖరీదు రు 1-0-0

క్రిందటిసభలలో తీర్మానింపబడిన ప్రకారము ప్రయిమరీ పాఠశాలలుగల గ్రామములలో వానియందు గ్రంథాలయమున కొక

గదిని స్థాపించువిషయము పుస్తకాలయపత్రికయందు ప్రకటింపబడి నది. కాని కొద్ది గ్రామములవారు మాత్రము, దాని సదుపాయ మును పొందిరి. సంస్థానమునందుగల 42 గ్రామములలో 6 తాలూ కాలయందు గ్రంథాలయసంఘములు ఇదివరకే గలవు. ఇప్పుడు 5 క్రొత్త తాలూకాసంఘములు ఏర్పడినవి. రాజుగారి సహాయమును పొందుచున్నవి. 706 గ్రంథాలయములు గలవు. వానియందు 472906 గ్రంథములు గలవు. వానిని 294,237 మంది చదివిరి. ఇవిగాక 172 పఠనమందిరములు గలవు. రాజుగారు వీనికై రు 95,000ల నిచ్చెదరు. ఇదేమొత్తమును లోకలుబోర్డులు ఇచ్చెదరు. ఇంకొక అంతమొత్తమును గ్రంథాలయములవారు ఖర్చుపెట్టెదరు. ఈగ్రామ గ్రంథాలయములు గాక బరోడా పట్టణమందొక కేంద్రగ్రంథాల యముగలదు. అందు 87,000 గ్రంథములు గలవు. గత సంవత్సర మున 97,036 మంది చదివిరి. కేంద్రగ్రంథాలయముయొక్క సంచార శాఖయందు 17,426 గ్రంథములు గలవు. అందు 11,864 గ్రంథ ములు 362 సంచారి పేటికలయందుంచి 130 గ్రామములకు బంపిరి. వానిని 4,982 మంది చదివిరి.

గ్రంథాలయములకు చవుకధరలకు పుస్తకములను పత్రికలను సప్లయి చేయుటకును, గుజరాతీ భాషయందు పుస్తకాలయ పత్రికను ప్రకటించుటకును "లైబ్రరీల కోఆపరేటివు సప్లయిసొసైటీ" పెట్ట బడి బాగుగ పనిచేయుచున్నది. సహాయగ్రంథాలయశాఖాధికారి తన సంచారములందు ఉపన్యాసముల నిచ్చుటయేగాక గ్రంథభాండాగార కులకు బోధనాతరగతులను గూడ నడపిరి.

గ్రంథభాండాగారి విధులు, స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయ ములు, స్త్రీలు – గ్రంథాలయములు అను విషయములనుగూర్చి, ప్రభు దేశాయి అనునామెయు మరియిద్దరుస్త్రీలును ఉపన్యాసముల నిచ్చిరి.

## తీర్మానములు.

అప్పుడు ఈ క్రిందితీర్మానములు అంగీకృతములాయెను. గ్రం థాలయోద్యమమును పోషించుటకై గైక్వారుగారికి వందనము లర్పింప

బడెను. ధర్మములకొరకు ప్రత్యేకింపబడు నూటికి రు 20 లవంతున సొమ్మును గ్రంథాలయముల కొసంగవలసినదని సహకారసంఘములను ప్రార్థించిరి. పాఠశాలలుండియు గ్రంథాలయములు లేని 574 బరోడా గ్రామములందు గ్రంథాలయములను స్థాపింపవలెననిరి. ఇంగ్లాండునందలి నేషనల్ హోంరీడింగు యూనియన్ వారి మార్గముల ననుసరించి ఈడు మీరినవారికి చదువుకొనుమార్గములను సూచింపవలెననిరి. గుజరాతీభాషయందు ప్రకటింపబడిన 2000 నవలలనుండి ఏర్చిన పట్టిక నొకదానిని ప్రకటింపవలెననిరి. కతియవారుసంస్థానము వారు గ్రంథాలయోద్యమమును వ్యాపింపజేయ ప్రోత్సహించుటకొక ఉపసంఘ మేర్పరచెను. కేంద్రగ్రంథాలయమందు గుజరాతీభాషా గ్రంథముల నభివృద్ధిపరుపవలెననిరి.

రాబోవుసభ పటాన్ గ్రంథాలయమువారి ఆదరణక్రింద జరుగును.

భావనగర సంస్థానమువారు ఇద్దరు యువకులను గ్రంథాలయ శాస్త్రమును నేర్చుకొనుటకై బరోడా కేంద్ర గ్రంథాలయమునకు బంపుచున్నారు.



# గ్రంథాలయోద్యమము

(కోణకంచి శ్రీరామచంద్ర బాలభక్త గ్రంథ వార్షికోత్సవ సమయమున శ్రీ జయంతిపురం రాజాగారిచే నియ్యబడినది.)

ఈ గ్రంథాలయము యొక్క ఆర్థికస్థితి చక్కగా లేదను విషయము కొంత విచారదాయక మయినను, కార్య నిర్వాహకవర్గము వారి పట్టుదలవలన నిప్పటికి పదమూడు వత్సరములనుండి నిరంతరాయముగా నడుపుచున్నందు కెంతయును సంతసించుచున్నాను. ఈ తాలూకాకు ముఖ్యస్థానము లనదగు నందిగామ, జగ్గయ్యపేటలలో గూడ నీయుద్యమమునం దీవిధమగు పట్టుదల గానవచ్చుటలేదు. వత్స

వాయిలో నొకటియునయించి నశించినది. కాన ప్రస్తుతస్థితిని బట్టి యీ తాలూకాకు దీనినే కేంద్ర గ్రంథాలయ మనవచ్చును. కార్యదర్శిగారి రిపోర్టువలన ప్రతినిత్యము చదువరుల సంఖ్య సగటున 6 గా నుండు టకు కారణము యిచ్చటి జనసంఖ్యలో చదువుకొనినవారల సంఖ్య తక్కువగా నుండుటయే గానోవును. విద్య విజ్ఞానములనునవి మానవజన్మ మెత్తిన ప్రతిమనుజునికిని అత్యావశ్యకములు. విద్య, విజ్ఞానములన కేవలము అక్షరములతో గూడినవని మాత్రమే భావింపజనదు. ప్రతిమనుష్యునికి పుట్టుకతోడనే అంకురరూపముగ కొంత విజ్ఞానముండును. దానిని విపులపరచుట మన గ్రంథాలయ ముల విధి. మనగ్రామములలో కేవలము పుస్తకరూపముననే గాక నీ యుద్యమము సినిమాలు, మాజిక్ లాంతర్లు మున్నగువాని మూల ముగ సులభసాధ్య మగును. ఇది యిప్పటిస్థితిని బట్టి చాల యావసర విషయము. దీనిని గూర్చి మన మెంతేని ప్రయత్నించి ఈ యవకాశ మును గైకొనవలెను.

గ్రంథాలయోద్యమము పాశ్చాత్య పద్ధతిని చూచి యవలం బింప బడినదని కొందర నుచుందురు. కాని యట్లు నుడువుట సరిగాదు. మనపూర్వులు దేవాలయములలో గ్రంథ సంచయము గావించియుండి అచ్చట నిత్యము పురాణపఠనము గావించుచుండెడివారు. రాజుల యాస్థానములలో గ్రంథభాండారము లుండెడివి. నేపాళరాజ్యములో 24 వేల గ్రంథములుగల సనాతన గ్రంథాలయము మున్నదని ఏషి యాటిక్ సొసైటీవారు తెల్పియుండిరి. ఇదిగాక భాగవతములు బొమ్మలాటలు, మున్నగునవి గూడ విజ్ఞానవ్యాప్తికి మనవార లేర్పర చిన సుసాధనములు. ఆ ధర్మ మిప్పటికాలమున మాసిపోయినది. ఇప్పు డా పరిస్థితులు మారినందున మనము యిప్పుడు ప్రపంచ చక్రము నందు మెచ్చటనున్నారమో, యే యనువున మన విద్యా విజ్ఞానముల నభివృద్ధి గావించుకొనవలయునో ఆధునికదృష్టితో జూడవలయును. పురాతనాచారమును బట్టి వ్రేలాడుచుండుట తగదు. కాలప్రవాహము ననుసరించి మనము మనలను సంస్కరించుకొనుచుండవలయును. లేని యెడల రెండింటికి చెడ్డరేవణివలె వ్యర్థులమయ్యెదము. ఇప్పటికాలము

నకు తగిన విజ్ఞానాభివృద్ధికి పత్రికలే ముఖ్యసాధనములని నాయభిప్రాయము. దినవారపత్రికలు తాత్కాలిక వృత్తాంతములను దెల్పును. మాసపత్రికలు అనుభవనీయులగు వారల వ్యాసములతో విజ్ఞానాభివృద్ధికి మంచి సాధనములు. మనగ్రామములలో చదువురానివారి సంఖ్య యెక్కువగాన నీ చదువుకొనినవారు చదువురానివారలకు చదివి వినిపించుచుండవలయును. మనము తెలిసికొనిన వారము గదాయని యానందించుటతో, ప్రయోజనము యేమియును లేదు. ఇతరులలో విజ్ఞానవ్యాప్తిని గావింప ప్రయత్నింపని విద్యావంతుడు విజ్ఞానద్రోహి యని నాయుద్దేశము. బుద్ధుని యుదాహరణముగ గైకొనుడు. తన విజ్ఞానమును దేశమునందంతటను వెదజల్లినాడు. తనకుగల విజ్ఞానవ్యాప్తికి సంస్థలను స్థాపించినాడు. గ్రంథాలయములన నిట్టి సంస్థలే కాని యిప్పటి గ్రంథాలయములలో పెక్కులు నామమాత్రములుగ నున్నవి. పూర్వము దేవాలయములలో నుండెడి గ్రంథములను గ్రామప్రముఖులును, రాజాస్థానములలో నుండెడివాటిని రాజులును రక్షణచేయుచుండిరి. ఇప్పటికైనను పురాణపఠనపద్ధతి ప్రతి గ్రామములోను ఉండవలయును. ఉపపత్తి కలిగినవారలు దీనిని నడుపుట యుక్తము. మన సనాతన గ్రంథాలయ ప్రతిష్ఠాపనము "వారన్ హేస్టింగ్సు" కాలమునుండి లుప్తమైపోయినది. ఇంగ్లీషు పాఠశాలల ఆరంభముతో మాతృభాష సంస్కృతభాషలు, వాని యభివృద్ధి ప్రయత్నములు మూలబడి పోయినవి. ప్రభుత్వమువారికి దేశభాషలలో రాచకీయ వ్యవహారములుండుట పనికిరానందుననే పై పరిస్థితి యేర్పడియుండెను. రాజా రామమోహనరాయలు ఇంగ్లీషు సర్వవ్యాప్తిని వాంఛించినను మాతృభాషాభివృద్ధియం దాయన చాల కృషి సల్పెను. మనమీ విషయమును ముఖ్యముగా గమనింపవలసినదై యున్నది. మన సాహిత్యమును గుఱించి పరదేశీయులు విమర్శించి మెఱుగులను తీసి చూపుచుండ మనము పురాణపఠనములతో తృప్తిపడగోరుచున్నాము. పారమార్థికము తప్ప ఆధిభౌతిక విషయములయందు మనకు శ్రద్ధలేదు. మన మీ రెండింటిని సమన్వయపరుపవలసియున్నది. దయానందసరస్వతి అట్లుచేసినాడు. ప్రాచీన లిపులనుగూడ

మనము తెలిసికొనవలయును. ప్రయత్నించినచో నసాధ్యమెద్దియును లేదు. ఇక, మన దేశమునకు ముఖ్యవృత్తి వ్యవసాయము. ఈ వ్యవసాయమును ఇప్పటి పరిస్థితిని బట్టి పాశ్చాత్యదృష్టితో విమర్శించి తెలిసికొనవలసియున్నది. అట్లు తెలిసికొనినయెడల మన మనేక విషయములను నూతనముగా తెలిసికొనగలము. మార్కెటు ధరలను తెలిసికొనుట వర్తకోపయోగమగు పంటలనే వేయుట, ఆయా పంటలకనువగునట్లు భూమిని సిద్ధపరచి వినియోగించుట, వీనికన్నిటికిని విద్య కావలయును. శాస్త్రీయముగ వ్యవసాయమును చేసి ఫలము ననుభవించుచున్న దేశములలో స్విజర్లాండ్, అమెరికా యెక్కువ ప్రసిద్ధి జెందియున్నవి. మనదికూడ వ్యవసాయదేశమే యైనను మనకు శాస్త్రజ్ఞానము లేదు. అమెరికాలో నొక యకరము భూమిలో 3 పుట్లు గోధుమలు పండించినట్లు ఇటీవలనే చదివియున్నాను. కావున మనముకూడ విద్యాజ్ఞానముతో గూడిన వ్యవసాయమును చేయుటకు సాధనములను పరిశోధించవలసి యున్నది. ఇట్టివానికన్నిటికిని గ్రంథాలయములే యాధారములు.

మీ గ్రామము మహాత్ముని పూజించిన గ్రామములలో నొకటి. మహాత్ముని యుపదేశములను వారి ముఖతా వినగల యదృష్టము మీకు లభించినది గావున మీరు మీగ్రామములోగల త్రాగుబోతుల దురభ్యాసములను మాన్పి మహాత్ముని యుపదేశమును అనుష్ఠానము లోనికి తేవలయును.

# ఆంధ్రగ్రంథాలయోద్యమము

## ముందు కావలసిన అభివృద్ధి మార్గములు.

ఇంతకాలమునుండియు ఆంధ్రదేశమందంతటను గ్రంథాలయోద్యమమును గూర్చి జరిగిన కృషికి ఫలితముగ బ్రిటిషు ఇండియా యొక్క ఇతర ప్రాంతములకంటె ఎక్కువ గాఢముగా పౌరగ్రంథా

లయములను గూర్చిన పరిజ్ఞానము ఈదేశమున వ్యాప్తినొందినదని చెప్పవలసి యున్నది. జరిగినపని తక్కువ, జరుగవలసిన పని ఎక్కువ. ఇట్టితరి ఆంధ్రులు తమకర్తవ్యమును బాగుగా గుర్తెరిగి కార్యవిధానములను నిర్ణయించుకొనుటయు, దానిని కార్యాచరణలోనికి తెచ్చుటయు అత్యవసరము. లేనిచో ఇదివరకు జరిగిన కృషియంతయుగూడ నిష్ప్రయోజన మగును.

ఇదివరకు మన దేశమున మారుమూలల గూడ గ్రంథాలయములు స్థాపింపబడి యున్నవి. పౌర గ్రంథాలయముల విధులేమో, ఇచ్చటి గ్రంథాలయములను నడుపువారలలో చాలమందికి తెలియును. వీనిలో అచ్చటచ్చట కొన్నిటికి స్వంతభవనము లున్నవి. కొన్నిటియందు వేలకొలది గ్రంథము లున్నవి. ఏకొద్ది సంఖ్యగలవానికైనను నిశ్చితమగు ఆదా యుండియున్నది. మన మ్యూన్సిపాల్టీలును లోకలు బోర్డులును గ్రంథాలయ నిర్వహణము తమవిధియని గుర్తెరింగిరి. దీనినంతను యాధారపరచుకొని మనము ముందంజ వేయవలసియున్నది.

ముందు జరుగవలసిన కృషి ఏదో ప్రథమమున నిర్ణయించుకొని అటుపిమ్మట అందుకు సాధనవిధానమును సూచించవలసియున్నది.

గ్రంథాలయము యొక్క ప్రాణము చదువరులు. వారిసంఖ్య యభివృద్ధి నొందుచు వారల విజ్ఞానము విశాల మగుచుండినగాని ఆసంస్థ శోభాయమానముగా నుండుటకుబదులు నిరుత్సాహకరముగా నుండును. కాన గ్రంథాలయాధికారులు ముఖ్యముగా చేయవలసిన విధి చదువరుల సంఖ్యను హెచ్చించుకొనుట. ఇందుకు అనేకమార్గములున్నవి. వాని నన్వేషించి కార్యాచరణలోనికి తేవలసి యున్నది.

విద్యాగోష్ఠులు, పోటీపరీక్షలు, తాత్కాలిక పాఠశాలలు, లిఖితమానపత్రికలు మున్నగు సాధనముల మూలమున గ్రంథాలయపు చదువరులయందు అనేకవిధముల జ్ఞానాభివృద్ధి చేయవచ్చును.

విద్యాగోష్ఠులన నేమో మొదట విచారింతము. కొందరు చదువరులు సారస్వత గ్రంథములు చదువుటయం దభిరుచి గలవారుగా

నుందురు. మరికొందరు వేరొకవిషయమునం దభిరుచి కలిగియుందురు. ఇట్లు ఏకవిషయమునందు పరిశ్రమ చేయగోరువారు ఒకగోష్ఠిగా జేరి ఏదో యొకగ్రంథమునుగాని లేక ఒకవిషయమును గూర్చి వేరువేరు గ్రంథములనుండి గాని సవిమర్శకముగా విద్యాపరిశ్రమ చేయవచ్చును. అందుకు ఫలితముగ యొక సభను సమావేశపర్చి అందు గోష్ఠి సభ్యులలో సమర్థులైనవారు వ్యాసములను చదువవచ్చును. ఇట్టి వ్యాసములు కొన్ని చేర్చి వాని నన్నిటిని ఆగ్రంథాలయము యొక్క లిఖితపత్రిక యనుపేరిట ప్రకటించ వచ్చును. ఎక్కువ సమర్థతనుచూప గల వ్యాసములేవైన యున్నచో "భారతి" మున్నగు పత్రికలయందు ప్రకటించవచ్చును. ఈవిధమున గ్రంథాలయమునకు నూతనమగు వికాసము వచ్చును. ప్రత్యేకవ్యక్తులు వైదుష్యమునందు ప్రసిద్ధిజెందుదురు. ఇట్టిఫలము సిద్ధించినప్పుడే గ్రంథాలయములు సార్థకమగును. భాష యభివృద్ధిజెందును. గ్రంథస్థమగు విషయములు విద్యావంతుల మూలమున ప్రజాసామాన్యమునకు కూడ వ్యాపించును.

పోటీపరీక్షలు మన యాంధ్రదేశమందు మిక్కిలి పరిపాటిలో యున్నవే, విజ్ఞానచంద్రికామండలివారును నర్సాపురపు సంఘము వారును రాజమండ్రియందలి కొన్ని గ్రంథాలయముల పక్షమున పోటీపరీక్షలు జరిగినవి. సారస్వత విషయములనుగూర్చియు ఇతర విషయములను గూర్చియు పరీక్షలు జరుపుటయు ఉత్తీర్ణులైనవారిలో అగ్రేసరులకు బహుమతు లొసంగుటయు ఈమూలమున జరుగుచుండెను. నర్సాపురపు సంఘమువారు ఇప్పటికిని నిరంతరముగ పరీక్షలు జరుపుచునేయున్నారు. తక్కిన సంఘములవారు జరుపుచున్నట్లు కనపడదు. తగిన సందర్భములుగల గ్రంథాలయములు ఇట్టి పోటీపరీక్షలను నెలకొల్పి చదువరులయందు విద్యాభిలాషను వృద్ధిపరచవచ్చును. కొందరు సామర్థ్యముగల విద్వాంసులు వారినుండి బయలుదేరుదురు.

ఇక తాత్కాలిక పాఠశాలలనుగూర్చి స్థలాంతరముల వివరించి యుండుటచే ఇచ్చట తిరిగి వ్రాయలేదు. వీనిని సాగించుటకు మన కున్న సాధనములనుగూర్చియే ఇచ్చట వివరింపబడును. కృష్ణామండలము నొకదానిని మాదిరిగా తీసుకొనవచ్చును, ఈ జిల్లాయందు 3 హైస్కూళ్ళున్నవి. మరియొక అయిదారు అసంపూర్తి హైస్కూళ్లున్నవి. వీనియన్నిటిలో ఏ నాలుగైదో తప్ప తక్కిన వన్నియు పల్లెటూండ్లయందే యున్నవి. ఈపాఠశాలలయందు భాషాసేవాపరతంత్రులును దేశోద్ధరణకై బద్ధకంకణులు నెందరోయున్నారు. వీరిసహాయముతో ఆయా ప్రాంతములయందున్న గ్రంథాలయ సంఘములవారు తాత్కాలిక పాఠశాలలను స్థాపించవచ్చును. ఆమూలమున గ్రంథాలయముల మూలమున విద్యాభివృద్ధి నొందించుకొనువారి సంఖ్య హెచ్చు చేయవచ్చును.

వీనికన్నిటికంటె ముఖ్యమగు విధి మరియొకటి యున్నది. దానిని వెంటనే ఆంధ్రగ్రంథాలయములు కార్యాచరణలోనికి తేవలసినవై యున్నవి. గ్రంథాలయపువ్యవహారములు చక్కగ కట్టుదిట్టముల ననుసరించి జరుగుచుండినగాని తగినచదువరు లచ్చటకు నాకర్షింపబడరు. అభివృద్ధికూడ జరుగదు. ఇందుకు ముఖ్యసాధనము తగినతరిబీతుపొందిన గ్రంథభాండాగారిని (librarian) నియమించుట ఈతరిబీతు సామాన్య విషయమైయున్నది. మనదేశపు స్థితిగతులను బట్టి మనకు కావలసిన విషయములను బోధించుటకు ఆంధ్రగ్రంథాలయ పక్షమున తాత్కాలిక పాఠశాలను స్థాపించవచ్చును. ఈతరిబీతు బొందుటకు యువకు లాకర్షింపబడరేమోనని సందేహింపవలసిన పనిలేదు. ఉద్యోగమునకన్న వేరుశరణ్యము లేదనుకొనువారిలో కొందరికి ఈమూలముగ కొంత మార్గమేర్పడును. భాషాసేవయు దేశసేవయుచేసి ధన్యతగాంచదలచిన యువకులెందరో మనదేశమధ్యమం దున్నారు. కావున వీరందరును తరిబీతుపొంది గ్రంథాలయములయందు భాండాగారిక స్థానముయందుండి మనగ్రంథాలయములను తగినకట్టుదిట్టముల ననుసరించి నడుపుదురు.

కావున మనగ్రంథాలయములు తమవిధులను తృప్తికరముగా నిర్వర్తించి తత్కాలమున దేశాభ్యుదయము చేకూరవలెనన్న పైన వివివరించిన విషయములను గమనించి వెంటనే కార్యాచరణలోనికి తెచ్చుట ముఖ్యావసరము.

—సూరి వెంకట నరసింహశాస్త్రి

# ఆంధ్ర భారతీ తీర్థ గ్రంథాలయ సభ.

విజయనగరమున 27-5-29 తేదీ ఉదయమున గ్రంథాలయ సభ ప్రారంభింపబడెను. ప్రార్థనజరిగినపిదప ఆహ్వాన సంఘాధ్యక్షులు జయంతి వెంకటనారాయణగారు ప్రతినిధులకు స్వాగత మిచ్చుచు యీ క్రిందిసంగతులు దెలియజేసిరి. "మనకు గ్రంథములు, గ్రంథాలయములు అవసరమన్న విషయ మందరికి తెలిసినసంగతే. విశ్వవిద్యాలయములే గ్రంథాల యోద్యమము నభివృద్ధిచేయవలసియున్నది. మన దేశములోనున్న విశ్వవిద్యాలయములన్నియు గవర్నమెంటుతో ద్వాటుచేనున్నవి. ప్రజాసామాన్యమున కందుబడిలేదు. ఈ ఆంధ్రభారతీ తీర్థము కేవలము ప్రజలయొక్క సంస్థ. దీనిమూలమున గ్రంథాల యోద్యమము అభివృద్ధికాగలదని తోచుచున్నది. అసహాయోద్యమము వచ్చినది మొదలు ఈ చిల్లర సభలు, ఉద్యమములు సన్నగిల్లెను. కాని యివి తిరిగి తలయెత్తుచున్నవి. ఈ క్షీణించిన గ్రంథాలయముల పునరుద్ధరించుటెట్లు అన్న సమస్య పరిష్కరింపవలెను.

పిదప డాక్టరు శేషగిరిరావుగారు ప్రసిద్ధమయిన క్షత్రియ కుటుంబములకు జెందినట్టియు, విజయనగర పెద్దాపుర సంస్థానాధీశులకు సన్నిహితులైనట్టియు, ఆంధ్ర, గీర్వాణ, పారసీక భాషలలో పాండిత్యముగలిగినట్టియు, తునివాస్తవ్యులు యూనియన్ బోర్డు అధ్యక్షులునగు శ్రీ మిర్జా రాజా నల్లపరాజు అచ్యుతరామరాజుగారిని అధ్యక్షులుగా నుండవేడిరి. ఈసందర్భమున శేషగిరిరావుగారు "ఆది భారతీ

తీర్థము పంపాతీరమం దుండెడిదనియు, పరమేశ్వరార్పణముగా నేడు స్థాపింపబడిన ఆంధ్రభారతీతీర్థము రాజకీయ, సాంఘిక, దేశభేదములు లేక యావన్మందికి జెందిన విద్యాపీఠమనియు, సర్వజన సమాదరణీయమై, ఉపాసనీయమై యుండవలసినదనియు గోరిరి. కోన వెంకటరాయశర్మగారు, పారనంది సత్యనారాయణగారు, భోగరాజు నారాయణమూర్తిగారు, దోమా వెంకటస్వామిగుప్తగారుగూడ అచ్యుతరామరాజుగారిని అధ్యక్షులుగా నుండగోరిరి.

అధ్యక్షులు శ్రీరాజావారు తమ గంభీరమైన అధ్యక్షోపన్యాసము చదివిరి.

పిదప హీరమండలము, నరసన్నపేట, బారువ, బుడత, ఇచ్ఛాపురము, అంగలూరు, బెజవాడ, చెన్నపట్నములకు జెందిన గ్రంథాలయ రిపోర్టులు చదువబడెను. అందు అంగలూరులో స్త్రీలకు ప్రత్యేకముగా గ్రంథాలయము స్థాపించుటకు శ్రీమతి అట్లూరి శేషమ్మగారు పడిన ప్రయాసములు. పట్టుదల ప్రశంసార్హములు.

28-5-29 తేది ఉదయం తిరిగి గ్రంథాలయసభ ప్రారంభింపబడెను. ఈక్రిందితీర్మానములు సభవారిచే నంగీకరింపబడెను.

1. భారతతీర్థమువారు గ్రంథాలయములను తమలో జేర్చుకొని వానిని యభివృద్ధిలోనికి దీసికొనివచ్చుటకుగాను గ్రంథాలయసభవారు ప్రార్థించుచున్నారు.

2. స్థానిక సంఘములు తమ పరిపాలనకు లోబడిన స్థలముల యందలి గ్రంథాలయములకు వార్షికవిరాళము లొసంగవలెనని యీ సభవారు స్థానికసంఘములను ప్రార్థించుచున్నారు.

3. భారతీ తీర్థ సంఘ పక్షమున స్థాపింపబడిన గ్రంథాలయ శాఖలో ప్రవేశించు ప్రతిగ్రంథాలయమువారు రూ 1-0-0 ప్రవేశ రుసుమునకున్ను, ప్రచారమునకై విరాళములను వసూలుచేయుటకు గ్రంథాలయములవారిని గోరడమైనది.

4. జాతీయపురోభివృద్ధికి భంగకరమగు షరతుల విధించుచు గ్రంథాలయముల కొసంగెడి ప్రభుత్వవిరాళముల నంగీకరింపవలదని యీసభవారు గ్రంథాలయములవారిని కోరుచున్నారు.

5. గ్రంథాలయోద్యమమును పునరుద్ధరించుటకు విద్యాధికులగు అభిమానులు సంచారము నొనర్చి ప్రబోధము కలుగజేయవలెనని గోరుచున్నారు.

6. ప్రతి గ్రామమునందును గ్రంథనిలయముల స్థాపించి వాటి యభివృద్ధికి తోడ్పడవలెనని ప్రజల నీ సభవారు హెచ్చరించుచున్నారు.

7. ఆంధ్రభారతీ తీర్థమున స్థాపింపబడిన గ్రంథాలయశాఖా పక్షమున ఆంధ్రదేశములో గ్రంథాలయోద్యమాభివృద్ధికై ప్రచారము చేయుంచుటకుగాను ఆంధ్రదేశములో గల పంచాయతీలు, యూనియనులు, తాలూకా జిల్లా బోర్డులు తగిన విరాళము లొసంగి పోషింపవలెనని యీ సభవారు ఆయా స్థానిక సంఘములను కోరుచున్నారు.

8. గ్రంథాలయపక్షమున ప్రచురింపబడుచున్న గ్రంథాలయ సర్వస్వమును ప్రతి గ్రంథాలయము తెప్పించి పత్రికాభివృద్ధికి తోడ్పడవలెనని యీ నభవారు గ్రంథాలయములవారిని గోరుచున్నారు.

9. గ్రంథాలయసంఘమునకు రాబోవు సంవత్సరమునకు యీ దిగువ సభ్యులు కార్యనిర్వాహకవర్గముగా నెన్నుకొనబడిరి.

అధ్యక్షుడు—శ్రీ రాజా మీర్జా నల్లపరాజ అచ్యుతరామరాజు బహద్దరుగారు.

ఉపాధ్యక్షుడు—డాక్టరు బుర్రా శేషగిరిరావుగారు.

కార్యదర్శులు—తిత్తి బలరామయ్యగారు, కోన వెంకటరాయ శర్మగారు.

సభ్యులు:—జయంతి వెంకటనారాయణ (బరంపురం), పుల్లెల శ్యామసుందరం (ఇచ్ఛాపురం), భగుడిపాటి చినయజ్ఞనారాయణశర్మ

(మాడగుల), అల్లంశెట్టి అప్పయ్య (పొందూరు), ఉమార్ ఆలీషా (పిఠాపురం), శ్రీకవిరాజ వత్సవాయి వెంకటనీలాద్రిరాజు(తుని), శివుడు శివరావు (కొవ్వూరు), శనివారపు సుబ్బారావు(నిడదవోలు), అయ్యంకి వెంకటరమణయ్య (బెజవాడ), సూరి వెంకటనరసింహశాస్త్రి, నడింపల్లి వేంకటలక్ష్మీనరసింహారావు (గుంటూరు), బెల్లంకొండ రాఘవరావు, మూగంటి బాపినీడు, పొనకా పట్టాభిరామరెడ్డి, గుర్రంసుబ్బరామయ్య, అల్లూరి వెంకటసీతమ్మ (అంగలూరు), అంధవరపు లక్ష్మణమూర్తి (హీరమండలం), తూలుపాటి సన్యాసమ్మ (గొల్లాం), పోలిశెట్టి ఆదినారాయణగుప్తగార్లు (గుంటూరు).

10. సంఘకార్యాలయము బారువలో నుండుటకు తీర్మానించడమైనది.

11. రాబోవుసభ తునిలో జరుపుటకు అధ్యక్షులచే నాహ్వానింపబడినది.

అధ్యక్షులకు, స్వచ్ఛంద సేవకులకు సభ్యులతరఫున కోన వేంకటరాయ శర్మగారు వందనము లర్పించిరి.

## రాయలసీమయందలి గ్రంథాలయములు.

నేను కర్నూలుపురము ప్రవేశించినతోడనే యాయూర నొక భాషానిలయ మాంధ్రగ్రంథాలయమను పేరున జక్కని స్థితిలోనున్నదని యెఱిగి నిన్నటిరాత్రి 7 గంటలవేళ దానిజూడబోయితిని. అప్పుడందు గ్రంథాలయకార్యములు నడచుచుండెను. ఈ గ్రంథాలయము చిన్నదైనను రాయలసీమయందలి గ్రంథాలయముల కెల్ల నాదర్శప్రాయమైనదగును. దాని గాంచినతోడనే యనిర్వాచ్యమగు నానందమే నాకు గల్గినది. కార్యనిర్వాహకులగు శ్రీయుత ఎం. వెంకటరామయ్యగారు త్సాహనిరతులు, భక్తివినయతత్పరులు, దాక్షిణ్యస్వభావులు, త్యాగ

శీలురునై కన్పట్టుచుండిరి. గ్రంథాలయసంస్థాపకులును పోషకులును వీరేయని తెలిసెడిని.

ఈ భాషానిలయము సంస్థాపింపబడి యారుసంవత్సరములే యైన నింతస్వల్పకాలములో మూడువేలకుపైన నాంధ్రాంగ్ల గ్రంథములు సమకూర్పబడినవి. గీర్వాణభాషాకృతులు కొన్నికలవు. అవియన్నియు నాయా వర్గముల కనుగుణముగ నున్నతములైన యద్దాల బీరువాలలో గ్రమభంగి నమర్చబడినవి. ఆలయమున బుస్తకముల బోషించువిధము కార్యనిర్వాహకుని యనుపమభక్తివిశ్వాసములకు బరమనిదర్శనమై కన్పట్టెడిని. ఆంధ్రగ్రంథారాధనమే సరస్వతీ కైంకర్యమను పూర్ణవిశ్వాసము వీరియందు గాఢముగ నెలకొనియున్నట్లు వీరి భక్తిపూర్వకమగు నిష్కళంక సేవ సాక్ష్యమిచ్చుచుండెను. ఇపుడు గ్రంథభాండాగారమున్న భవన మీనిలయమునకు స్వతంత్రమైనది. ఇంతియగాక దీనికి బదియకరములనేల మాన్యక్షేత్రముగ నొంపబడియున్నదను విషయ మెంతయు హర్షదాయకముకదా ?

ఈ గ్రంథాలయమున బనిజరుగుసమయము సాయంకాలము 5 నుండి 7 వరకు రెండుగంటలుమాత్రము. అదిచాలు ననరాదు. గాన నింకను కాలపరిమితిని హెచ్చించుట యవసరమని తోచెడిని. నూతన గ్రంథములతో బాటు ప్రాచీనతాళపత్రగ్రంథములను సేకరించి యుంచుటయు గ్రంథాలయనిర్వాహకుని ముఖ్యధర్మము. భాండాగారమున వారమునకో పక్షమునకో యొకమారు పురాణపఠనము గాని హరికథాకాలక్షేపముగాని మహనీయుల సదాదేశముల గాని యేర్పఱిచి తన్మూలమున జదువెఱుగని సామాన్యజనుల కింతజ్ఞానభిక్ష యిడుట ముఖ్యావసరముగదా?

మా యనంతపురమండలమున బెక్కుగ్రంథాలయములు పుట్టుచున్నవి. గిట్టుచున్నవి. కదిరిలో ఖండేరావుగారు ప్రతిష్ఠించి యుండిన పుస్తకాలయము తెరమఱుగున జేరెనేమో. గుత్తిలోని యుత్తమ గ్రంథభాండాగారపు బొలకువ యసలే తెలియరాదు. పెనుగొండ

యందలి శ్రీకృష్ణదేవరాయగ్రంథనిలయము కనులుమూసి తెరచుచున్నదట. మడకసిరాలోని వెనుకటి సరస్వతీపుస్తకభాండాగారము దీర్ఘనిద్రను బొందినది. ఈవల వెలసిన రవీంద్రుని పఠనాలయ మిపుడిపుడు తన నవీనోత్సాహము బ్రకటించుచుండుట గమనించుచున్నారము. ప్రజాసమితి కత్యంతోపయోగకరములగు నీభాండాగారము లిటు లధోగతినందుటకు బౌరులలో వైషమ్యములు ప్రబలుటయు గార్యకరులయందు మాత్సర్యములు రేగుటయు గ్రంథాలయముల స్థిరప్రతిష్ఠకు దగిన యాధారములులేకపోవుటయు గారణములు కావచ్చును. పైనబేర్కొనిన యుత్కృష్టాదర్శముల ననుసరించి సక్రమపథమున నడచుచు రాయలసీమయందెల్ల నద్వితీయమగు స్థానము వహించియుండిన ధర్మవరమునందలి రెండుగ్రంథాలయముల గతియేమైనదో? కోటలోనినిలయము కొనయూపిరితో నున్నదనియు పేటలోనిది రూపుచెడి నశింపనున్నదనియు వినికిడి. ఇందులకు ధర్మవరపౌరులుగాక మరెవ్వరు బాధ్యులు? ఈగ్రంథాలయముల పూర్వస్థితి నూహించి యిప్పటి పతితదశనుగూర్చి యోజించుచో పౌరులు కనులు మూసికొని పోయిరా యనునంతటివిచార మెట్టివారికైన గలుగకమానదు. నేను ముఖ్యముగ నందలి పేటగ్రంథాలయ (క్రియాశక్తి) పతనదశను మదినుంచుకొనియే మనవిచేయుచున్నాడను. ధనాఢ్యులైన వైశ్యయువకుల హస్తవశ మొనర్పబడిన యీభాషానిలయమున కింతటి యధోగతిగల్గెననిన నెంత సిగ్గులచేటు!

—సీరిపి ఆంజనేయులు ( ఐంద్రావతి. )

# శ్రీరామచంద్ర బాలభక్త పుస్తకభాండాగారము

## కొణకంచి.

ఈ గ్రంథాలయముయొక్క పదమూడవవార్షికోత్సవము 2-6-1929 తేదీన శ్రీరాజా వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాద్, బహద్దర్, మన్నెసుల్తాను జయంతీపురం జమీందారుగారి అధ్యక్షతక్రింద జయప్రదముగ జరిగెను.

చుట్టుపక్కల గ్రామాదులనుండి 400 మంది విచ్చేసిరి. బాలభటులు సభయందు ఏర్పాటులనన్నింటిని వినయముతో జూచుచుండిరి. ప్రారంభమున సరస్వతీపూజ జరిగినది. తదుపరి ప్రార్థనజరిగిన పిమ్మట అధ్యక్షులకు వినతిపత్రము సమర్పించిరి. కొణకంచి వెంకటేశ్వరరావుగారు సాంవత్సరికరిపోర్టును చదివిరి. పిదప గ్రంథాలయము వలని లాభములను గూర్చియును గ్రంథాలయపు పూర్వచరిత్రములనుగూర్చియును కొణకంచి చక్రధరరావుగారును, రైతులందరును సమావేశమగుటవలన "రిసెటిల్‌మెంటును" గూర్చి పురుషోత్తమరావుగారును, నిమ్నజాతి యుద్ధరణము-గ్రామపారిశుద్ధ్యమునుగూర్చి కాకమాను పిచ్చయ్యచౌదరిగారును, ఖద్దరునుగూర్చి సుంకర నరసింహంగారును, గ్రంథాలయోద్యమమునుగూర్చి కంచకచర్లకృష్ణంగారగు పింగళి ఆంజనేయులుగారును, త్రాగుడునుగూర్చి రేపాల బుచ్చిరామశేషయ్యశ్రేష్ఠిగారును, గ్రంథాలయములెట్లు పనిచేయవలయును అను విషయమున తమకుగల యనుభవమును బట్టి గ్రంథాలయాధ్యక్షుడగు రేపాలశేషయ్యశ్రేష్ఠిగారును, బాలభటోద్యమమును గూర్చి బాలభటనాయకుడగు లావు వెంకటేశ్వరరావు చౌదరిగారును, స్త్రీవిద్యనుగూర్చి శ్రీమతి కొణకంచి సరస్వతీ బాయమ్మ గారును ఉపన్యసించిరి. శ్రీరాజాగారియుపన్యాసముతో సభ ముగిసెను.



## ఈశ్వర పుస్తకభాండాగారము, కాకినాడ.

ది 1-4-28 లగాయితు 31-3-1929 తేదీతో అంత్యమగు సం॥రమునకు పరిపాలన నివేదిక :—

ఇందు 105 మంది పురుషులును, 28 మంది స్త్రీలును సభ్యులుగా గలరు. కార్యనిర్వాహణమునకై గతసంవత్సరమున జరుపబడిన 3 సభలకు బదులు యీ సంవత్సరములో 5 సభలు గావింపబడెను. ఒక సాధారణసంఘసభ జరుపబడెను.

ఇద్దరు జవానులు నె 1కి రు 9–0–0 లు చొ॥న రు 4–0–0 లు చొ॥న యున్నూ దాసీమనిషిని 1కి రు 0–6–0 లు చొ॥న యున్నూ నియమింపబడెను. భాండాగారము ప్రదయం 7 గంటలకు తెరచి 10 గంటలకు మూయబడుచూ తిరిగి మధ్యాహ్నము 2–30 గంటలకు తెరచి సాయంకాలము 7–30 లకు మూయబడుచుండెను. గత సంవత్సరమునకన్న యీ సంవత్సరములో భాండాగారమునకు ప్రతిదినము పాఠకులు ఎక్కుడుమంది వచ్చుచుండిరి. సభ్యులుగాని తదితరులకు భాండాగారమునుండి పుస్తకములను ఇండ్లకు ఇచ్చుటలేదు. భవనము నందే చదువుకొనుటకు యివ్వబడుచుండెను. స్త్రీ సభ్యులకు వారికి కావలసిన పుస్తకములు వారి యిండ్లకు చదువుకొనుటకు యివ్వబడు చుండెను. విస్తారము స్త్రీల ఉపయోగమునిమిత్తం యీ భాండాగారము నకు భారతి, గృహలక్ష్మి, స్త్రీధర్మ అను మాసపత్రికలను తెప్పించ బడెను. పురుషసభ్యులలోకూడా ఏయేగ్రంథములు అభిరుచికలిగియుం డెనో సాధ్యమైనంతవరకు అట్టి గ్రంథములుకూడా భాండాగారమునకు తెప్పింపబడుచుండెను. ఈ వత్సరమున ఆదాయము రు 953–2–7 లు. వ్యయము రు 803–3–3 లు. క్రొత్తగా 3 బీరువాలు కొనబడెను.

సభ్యుల చందాలవలన గతసంవత్సరముకన్న యీసంవత్సరము లో ఎక్కువవసూలు కాబడెను. ఈ సంవత్సరములో దొరతనము వారు రు 50 లున్నూ స్థానికసంఘమువారు రు 50 లున్నూ విరాళ ములను ఇచ్చిరి. అందువలన ఆదాయము గతసంవత్సరముకన్న యీ సంవత్సరములో హెచ్చుగానుండెను. ఈ గ్రంథాలయమునకు 40 పత్రి కలు వచ్చుచున్నవి.

8. యీ గ్రంథాలయమునకు యీ సంవత్సరములో మహా నీయులు 315 పుస్తకములను దయచేసి సానుభూతిని చూపిరి.

ఈ గ్రంథాలయములో మొత్తముమీద షుమారు రు 2200 కిమ్మతుగల 2400 పుస్తకములు గలవు. అందు మిాజుమునలై 1636 తెలుగు సంస్కృతము గ్రంథములున్నూ; 764 ఇంగ్లీషు గ్రంథము లున్నూ గలవు.

544

ఈ వత్సరము పురుషసభ్యుల ఇండ్లకు యివ్వబడ్డ పుస్తకములు 1867; స్త్రీసభ్యుల ఇండ్లకు యివ్వబడ్డ పుస్తకములు 467.

గ్రంథాలయములోని పుస్తకములను, వార్తాపత్రికలను సభ్యులుకాని తదితరులకు వుచితముగా పఠనమందిరమందు యివ్వబడు చుండును. గ్రంథాలయములో రు 290 లు కిమ్మతుగల 9 బీరువాలు ఉండెను.

# శ్రీ రవీంద్ర పఠనమందిరము - మడకశిర.

ఈ పఠనమందిరము 17-5-28 తేదిన స్థాపింపబడినది. నాంటి నుండి నేటివరకు నిది సభ్యుల యాదరముచే దినదినాభివృద్ధి నొందు చున్నదని వ్రాయుట కెంతయు సంతసమగుచున్నది. ౧౮ పత్రికలు వచ్చుచున్నవి.

పాఠకుల యుపయోగార్థమై యొక చిన్న గ్రంథాలయము సయితము ప్రారంభింప బడినది. దీనిని వృద్ధిపరచుటకు వలయు ప్రయత్నములు చేయబడుచున్నవి. ఈపురప్రజలు అదృష్టవశముచేత యిచ్చటి పూర్వపు శ్రీ సరస్వతీ పుస్తక భాండాగారమునకై యూని యన్ బోర్డు పబ్లికు లైబ్రరిపేరట రూ 200 లు గౌర్నమెంటువారు గ్రాంటు నిచ్చియున్నారు. యూనియన్ వారు సహా రూ 200 లు ఖర్చుపెట్టి యీ భాండాగారమును పునరుద్ధరింప యత్నించుచున్నారు. వీరి యత్నము లెన్నదగినవే. సర్వేశ్వరుండు వీరికి తోడై కార్యము ఫలింపం జేయుగాక.

ఈ మందిరపు యాజమాన్యమున అప్పుడప్పుడు హరికథలు, ఉపన్యాసములు, జయంత్యుత్సవములు మొదలగునవి జరుపబడు చున్నవి. జే. రంగారావు బి. ఎ., ఎల్. ఎల్. బి., గారు (పెనుగొండ) యిచ్చటికి తమపనిపై వచ్చినపుడెల్ల యీ పఠనమందిరము

తరఫున భారతమునందలి ముఖ్యపాత్రలను వరి యొక్కొక్కరిని గూర్చి విపులముగా ముచ్చటించుచున్నారు.

ఇచ్చట పత్రికా పఠనమునకు మాత్రమే గాక గృహాంతర క్రీడలకు సహితము తా వొసంగబడినది. అందు ముఖ్యముగ చదరంగపు ఆట చాలమంది యాడుచున్నారు. వీరలొక చదరంగపు సంఘముగా చేరి అనుదినమును సాయంకాలము పత్రికా పఠనానంతరము యీ ఆటను ఆడుచుందురు. ఈవిషయమున నెక్కుడు శ్రద్ధవహించి రానివారలకు ఆటను నేర్పించుచుండు శ్రీయుత వై. వెంకటరావుగారెంతయు అభివందనీయులు.

ఈ పఠనమందిరమునకు 3 తరగతుల సభ్యులు కలరు. వారి సంఖ్య 53. నెలకి సరాసరి రూ 20లు చందాలు వసూ లగుచున్నవి. నెల 1 కి రూ 3 ల వేతనముపైన నొక సేవకుడు కలడు.

1—6—28 నుండి 28—2—29 వరకును దీనికి ఆదాయము రు 238—0—10 లును, వ్యయము రు 220—8—8 లును అయియున్నది.

ఈ పఠనమందిరము చిరస్థాయిమై వర్ధిల్లుటకై శ్రీయుతులు పి. వెంకోబరావు, ఎమ్. ఎ, ఎల్. టి (డిప్యూటి యిన్స్పెక్టరు ఆఫ్ స్కూల్సు, హారపనహళ్ళి) గారున్ను వీరి అనుంగు తమ్ములగు శ్రీయుత పి. శ్రీనివాసరావు (బి. ఎ. బి. ఎల్. వకీలు, బళ్ళారి) గారున్ను దయయుంచి తమ స్వగృహమును బాడుగలేక యీమందిరమును నెలకొల్పుటకు ఉచితముగా అనుజ్ఞ యిచ్చినారు. వీరలకు మావందన శతములు. —తుంపర్తి పుల్లయ్య, గౌరవ కార్యదర్శి.

## సహకారశారదావిద్యానిలయభాండాగారము.

(నెల్లూరుజిల్లా గూడూరుతాలూకా కురుగొండగ్రామము)

ఈగ్రంథాలయముయొక్క ప్రథమ వార్షికోత్సవము 27-4-29 శనివారం సాయంకాలం గూడూరుతాలూకాబోర్డు ప్రెశిడెంటుగారైన

శ్రీ పెల్లేటి వెంకటసుబ్బారెడ్డిగారి అధ్యక్షతక్రింద జయప్రదముగా జరుపబడినది. నెల్లూరు, వెంకటగిరి మహారాజావారి కాలేజీ ప్రిన్సిపాల్ గారగు మామిడిపూడి వెంకటరంగయ్య, ఎమ్. ఎ. గారు గ్రంథాలయముల ప్రయోజనములగూర్చి ఉపన్యసించిరి. తత్సభకు నెల్లూరు డిస్ట్రిక్టుబోర్డు మెంబర్లుగా రలైన శ్రీ పెల్లేటి వీర్రాఘవరెడ్డిగారు, మఫ్ఫూవీరు నారాయణరెడ్డిగారున్నూ, తదితర ప్రముఖులును దయచేసిరి. ఉపన్యాసములు జరిగెను.

రాత్రి శారదావుత్సవము జయజయ ధ్వనులతోను పతాకములతోను మేళతాళములతోను వందలకొలది జనులతోను గ్రామమంతటను జరిగినది. శ్రీ గంటవరం పిచ్చిరెడ్డిగారు సీతాకల్యాణము హరికథ కాలక్షేపణ జరిపిరి. మరుదినం బోర్డు ప్రథమపాఠశాల విద్యార్థులు విజ్ఞానవతినాటకమును ప్రదర్శించిరి.

కార్యదర్శినివేదికనుండి ఈక్రిందివిషయములను ప్రచురించుచున్నాము: ఈ గ్రంథాలయము 2-7-1927 తేదీన స్థాపింపబడినది. మొదటస్థాపించిన గ్రంథాలయము ఒక మారుమూలనుండుటబట్టి జనసామాన్యమున కుపయోగకారి కాజాలదయ్యె ఇట్లుండగా 26-4-28 తేదీన కొందరు యువకులుగూడి, స్వల్పముగా చందాలు వేసుకొని గ్రామమునందలి యువకుల గృహములందున్న గ్రంథములన్నిటిని సేకరించి ఆ గ్రంథములను నాస్వాధీనపరచి ప్రాథమికబోర్డు పాఠశాలయందే శారదావిద్యానిలయ పుస్తకభాండాగారమను నామమిడి ప్రస్తుత భాండాగారమును నెలకొల్పిరి. 1-8-28 తేదీ మొదలు ఆంధ్రపత్రిక, సమదర్శిని, అను వారపత్రికలు తెప్పించి పాఠకులు చదువుటకు ప్రారంభించిరి. ఈభాండాగారము అట్టి దీనస్థితియందు రెండుమాసములకన్న మెక్కువకాలముండక దినదినాభివృద్ధి నొందించుటకు యీ గ్రామ సహకారసంఘమువారు తోడ్పడి సదరు శారదావిద్యానిలయ పుస్తకభాండాగార నామధేయమునకు మొదలు సహకారమను నామధేయ

మిడిరి. అప్పటినుండియు శ్రీ సహకార శారదా విద్యానిలయ పుస్తక భాండాగారమను పేరు నెలకొల్పబడినది.

ఈ గ్రంథాలయమందు 321 గ్రంథములు గలవు. గ్రంథాలయమునకు వచ్చు పాఠకుల సంఖ్య నెలకు 300 మంది. ఇండ్లకు తీసికొనిపోవువారి సంఖ్య 123 మంది. 53 గురు చందాదారులవల్ల రు 95 లు వసూలగుచున్నది. ఇతర గ్రంథాలయములవలె పుస్తకములు చందాదార్లుగానివారికి యిండ్లకు యిచ్చుపద్ధతి యీ గ్రంథాలయమున లేదు. జనసామాన్యమునకు గ్రంథములను చదువుట కవకాశము యెక్కువగా కలుగజేయుటకై చందాదార్లు కానివారికి గ్రంథములు స్త్రీలకు పురుషులకు యిండ్లకు యిచ్చునట్లు యీ సభలో తీర్మానించబడవలయును— ఈ వత్సరము ఆదాయము రు 163-7-9 లు; వ్యయము రు 153-14-0 లు— 7 పత్రికలు వచ్చుచున్నవి.

ఈ గ్రంథాలయము గూడూరు తాలూకా గ్రామాదులలోని ప్రజలకు మార్గదర్శియైయున్నది శ్రీగూడూరు వెంకటసుబ్బారెడ్డిగారు యీ భాండాగారమునకు ప్రథమమున తమ యొద్దనున్న భారతాది గ్రంథము లన్నిటి నిచ్చి బాగుపరచుటకు కంకణముగట్టి పెక్కువిధముల తోడ్పడుచు పురోవృద్ధికొరకు పాటుపడుచు యీ స్థితికి తెచ్చినందులకు గ్రంథాలయము వారందరు కృతజ్ఞతాపూర్వకమైన వందనము లర్పించుచున్నారు. వీరు అచిరకాలములోనే భవననిర్మాణము చేయగలందులకు సభ్యులందరు యేకగ్రీవముగా ప్రార్థించుచున్నారు.

ఈ గ్రామసంఘమువారు వార్షికవు చందా రు 25 లు ఇచ్చునట్లు ఒప్పుకొన్నందుకు మా సంఘమువారు వారికి వందనము లర్పించుచున్నాము. జిల్లాబోర్డు మెంబరుగారైన పెల్లేటి వీరారాఘవ రెడ్డిగారు రు 25 లు విలువగల అద్దములు బీరువాను ఇచ్చిరి. ఇంకను పలువురు గ్రంథములను సహాయము జేసిరి. వారందరికిని వందనములు.

—షేకు చినిగీసాసాహేబు, కార్యదర్శి.